# మాండూక్యోపనిషత్తు - షడ్విధతాత్పర్యలింగ నిర్ణయము



- శ్రీ ఓంకారానంద బ్రహ్మాచారి

ఓమితి బ్రహ్మ

**శాంతి మంత్రము :-**

ఓం భద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాః।
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః।
వ్యశేమ దేవహితం యదాయుః।
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః।
స్వస్తి నః పూషా విశ్వవేదాః। స్వస్తి
నస్తార్‌క్ష్యో అరిష్టనేమిః। స్వస్తినో
బృహస్పతిర్దధాతు।
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

ఓ దేవతలారా! శ్రవణేంద్రియముచే వేదాంత తత్త్వాన్ని వినెదము గాక! చక్షురింద్రియముచే మంగళ కరమైన మీ రూపాలను చూచెదము గాక! ఓ అమరులారా! మాచే యజ్ఞ హవిస్సులను అందుకొని దృఢమైన కరచరణాద్య వయవయుక్త శరీరమును, శత సంవత్సర ఆయుష్షును అను గ్రహించండి. ఇంద్రుడు, సూర్యుడు, గరుత్మంతుడు, బృహస్పతి మనకు కళ్యాణమును చేకూర్చెదరుగాక! త్రివిధతాపములు శాంతించుగాక!.

ఈ ఉపనిషత్తు అథర్వవేద బ్రాహ్మణ భాగానికి సంబంధించినది. ఇది ఓంకార ప్రతిపాదిక ఉపనిషత్తు. ఇందులో '12' మంత్రాలు గలవు. భావగాంభీర్యము మరియు అతిసారవంతమైన ఉపనిషత్తు ఇది. అంతేకాకుండా ఓంకార వైశిష్ట్యాన్ని తెలుపుతూ, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థాత్రయాల నుండి జీవుని వేరు చేసి తురీయావస్థను తెలుపుతుంది ఈ ఉపనిషత్తు.



**'ఓంకారస్వరూపా! మలయాళ మౌనీంద్ర! గురుదేవా! శ్రీవ్యాసాశ్రమ యతీంద్ర! సంసారానికి హేతుభూతములు అవిద్య, కామం,కర్మ, వీటివల్ల మేము సంసారాన్ని పునః పునః పొందుతున్నాము. అవిద్య తత్ జనిత కామం తత్ ద్వారా కర్మ ఇలా సంసారానికి మూలకారణం అవిద్యయని నిర్ధారణమైనది. ఏతాదృశ అవిద్యతత్‌కార్యాలను నిర్మూలింపజేసి మమ్ము రక్షింపుమా మా గురుదేవా!'.**

ఆధ్యాత్మిక పురోభివృద్ధిని కోరు ప్రతి ముముక్షువు ఈ ఉపనిషత్తును సవిస్తరముగా గురువుల ద్వారా తెలుసుకోవాలి. ఎందుకంటే మనోరాహిత్యమైన స్థితి కేవలము ఓంకారమును జపించడం వల్ల సిద్ధిస్తుంది.

ఉపనిషత్తులు ప్రధానముగ జ్ఞానమును మోక్షసాధనముగ బోధించుచు తత్సాధన రూపముగ అనేకము లగు ఉపాసనలను కూడ బోధించినవి. అట్టి ఉపాసనలలో ఓంకారోపాసన చాల ప్రధానమైనది. ఛాందోగ్య, ప్రశ్న, మాండూక్యాద్యుపనిషత్తులలో ఓంకార స్వరూప తదుపాసనలు అతి విస్తృతముగ వర్ణింపబడినవి.

శ్రీ గౌడపాదాచార్యులు ఈ ఉపనిషత్తుకు కారికలు (215) రచించారు. ఇందు నాలుగు ప్రకరణములు గలవు. వీటికి శ్రీ భగవత్పాదులు భాష్యం వ్రాశారు.

**1)** ఆగమ ప్రకరణము :- ఇందులో మాండూక్య ఉపనిషత్ యొక్క '12' మంత్రములు, 29 కారికలు గలవు. ఉపనిషత్తుననుసరించి ఓంకారమహిమ,

మాత్రలు, పాదములు, విశ్వతైజస ప్రాజ్ఞతురీయులను అధిదేవతలు వర్ణింపబడినవి.

**2) వైతథ్యప్రకరణము :-** ఇందు '38' కారికలు గలవు. జగత్తు యొక్క మిథ్యాత్వమును, సర్వము మనోకల్పితమను సిద్ధాంతమును బహువిధయుక్తులతో తర్కములతో ప్రతిష్ఠాపితమయినవి.

**3) అద్వైత ప్రకరణము :-** ఇందు '48' కారికలు గలవు. కేవల శ్రుతి ప్రమాణమే గాక, తర్కముచే గూడ ద్వైతవాదము తిరస్కృతమై, అద్వైతమే పరమార్థము అని నిర్ణయింపబడినది.

**4) అలాతశాంతి ప్రకరణము :-** ఇందు '100' కారికలు గలవు. ఇందు బౌద్ధ చార్వాక జైన ఆగమములు ద్వైతవాదములు ఖండింపబడినవి.

**ఏకాక్షరమైన ఓంకారము పరబ్రహ్మనికి ప్రతీక. సమస్త విశ్వానికి ఆధారమైనది ఓంకారము. అకార, ఉకార, మకారయుక్త ఓంకారము త్రిమూర్త్యాత్మకము. సమస్త దేవతలకు, సమస్త మంత్రాలకు మూలస్థానం ఓంకారము. సమస్త భూతములను రక్షించునది ఈ ఓంకారమే. అందువల్ల ముముక్షువు ఓంకారోపాసన తప్పక చేయాలి.**

**ఓంకారము :-**

**"బ్రహ్మహవై బ్రహ్మాణం పుష్కరే ససృజే. సఖలు బ్రహ్మో సృష్టిశ్చిన్తామ్ ఆపేదే. కేనాహం ఏకేనాక్షరేణ సర్వాంశ్చ కామాన్, సర్వాంశ్చ లోకాన్, సర్వాంశ్చ దేవాన్, సర్వాంశ్చ వేదాన్, సర్వాంశ్చ యజ్ఞాన్, సర్వాంశ్చ శబ్దాన్, సర్వాంశ్చ వృష్టీః, సర్వాంశ్చ భూతాని స్థావర జంగమాన్యనుభవేయమ్ ఇతి. స బ్రహ్మచర్యమ్ అచరత్. స ఓమ్ ఇత్యేతద్ అక్షరమ్ అపశ్యత్ త్రివర్ణం చతుర్మాత్రం సర్వవ్యాపి."**

-(గోపథ బ్రాహ్మణము)

బ్రహ్మయే బ్రహ్మను పుష్కరక్షేత్రమున ప్రతిష్ఠించాడు. అట్లు ప్రభవించిన బ్రహ్మ చింతించినాడు. సమస్త కోరికలను, సమస్త లోకాలను, సమస్త దేవతలను, సమస్త వేదములను, సమస్త యజ్ఞములను, సమస్త శబ్దములను, సమస్త వర్షములను, స్థావర జంగమాత్మక సమస్త భూతములను ఒకే అక్షరమున అనుభవించుటెట్లు? అతడు బ్రహ్మచర్యమును ఆచరించినాడు. అతడు **"ఓమ్"** అను అక్షరమును దర్శించినాడు. అది మూడు వర్ణములది, నాలుగు మాత్రలది. సర్వవ్యాపి. ఈవిధముగా ఓంకారము గురించి గోపథ బ్రాహ్మణములో వివరింపబడింది.

**"సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః"** ఒక్కమారు ప్రణవమును ఉచ్చరించినంతనే శ్రేష్ఠగతిని పొందించుటవల్ల ఓంకారమనబడును.

**ఓంకారశ్చ అథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణఃపురా।**
**కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాత్ మాంగళికా ఉభౌ॥**

ఓంకారము, అథ శబ్దము బ్రహ్మదేవుని కంఠం నుండి బయలు దేరాయి. అందుకే ఓంకారము, అథశబ్దము మంగళప్రదాలు.

సామాన్యముగ గ్రంథము యొక్క తాత్పర్యమును నిర్ణయించుటకు ఆరు ప్రమాణములను తఱచి చూచెదరు. వాటినే షడ్విధ తాత్పర్యలింగనిర్ణము అంటారు. అవి: 1) ఉపక్రమోపసంహారములు 2) అభ్యాసము 3) అపూర్వత్వము 4) ఫలము 5) అర్థవాదము 6) ఉపపత్తి. ప్రస్తుతము ఈ ఉపనిషత్తునందు వీటిని తెలుసుకుందాం!.

**1) ఉపక్రమము :- ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ। యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ॥**

ఈ సమస్తమూ ఓంకారమే. ఓంకార ఉపాఖ్యానము చెప్పబడుచున్నది. భూత, వర్తమాన,

భవిష్యత్ కాలాత్మకమగు సర్వమోంకారమే. ఈ కాలత్రయమును అతిక్రమించినది కూడా ఓంకారమే.

**"ఏతద్వైసత్యకామ పరంచాపరం చ బ్రహ్మ యదోంకారః" "ఓమిత్యాత్మానం యుంజీత" "సర్వం ఓమితీదగ్ం"** ఇత్యాది శ్రుతివాక్యాలు ఈ సమస్తమూ ఓంకారమేనని ప్రతిపాదిస్తున్నాయి.

సత్యానికి ప్రతి రూపంగా హరిశ్చంద్రుని, ధర్మానికి ప్రతిరూపంగా ధర్మరాజును, అహింసావ్రతానికి ప్రతిరూపంగా బుద్ధుని మనము చెప్పుకుంటాము. ఇక ఓంకారానికి ప్రతిరూపంగా శ్రీమలయాళస్వామిని కొనియాడక తప్పదు. ఎందుకంటే వారి ఆధ్యాత్మిక జీవితమంతా ఓంకారముతో ముడిపడి ఉంది. ఓంకార ధ్యేయమైన అక్షరపరబ్రహ్మను నిరంతరము స్మరిస్తూ, భక్తులతో స్మరింపజేస్తూ వారి హృదయ పీఠాలలో నిలిచిన శ్రీగురుదేవులు ప్రాతఃస్మరణీయులు.

**దైవీ సంపత్తిని అలవరుచుకొని ఏకాక్షరమైన ఓంకారమును ధ్యానము చేసినంత మాత్రమున సాధకుడు కైవల్యస్థితిని అనాయాసముగా పొందును.**

ఈ మంత్రంలో ఈ సమస్తమూ ఓంకారమే అని వచ్చింపబడింది. దీనిని అక్షరాలా తమనిత్యజీవితంలో ఆచరణాత్మకముగా తెలిపారు శ్రీ గురుదేవులు. అదిగో! శ్రీవ్యాసాశ్రమం ఆంధ్రదేశ ఆధ్యాత్మిక పీఠాలకు మూలస్థానం. ఆశ్రమంలో ప్రతికుడ్యముపై ఓంకారము వెలుగొందుతుంటుంది. ఆశ్రమంలో ప్రవేశించిన మరుక్షణమే ఓంకారనాదముతో మన మనస్సు తన్మయత్వం పొందుతుంది. తన్మయత్వము నొందిన ఆ మనస్సుతో మమ్ము రక్షింపుమా! మా గురుదేవా అంటూ వెడుకుంటారు భక్తులు.

పంచభూతాత్మకమైన ఈ ప్రపంచములో సర్వత్రా ఓంకారము ప్రతిధ్వనిస్తూంటుంది. పారే సెలయేరు లోపల, వీచే గాలిలోపల, జ్వలించే అగ్నిలోపల ఏకాక్షరమైన ప్రణవనాదము మన కర్ణపుటాలను చేరి ఆనందాన్ని కలిగిస్తూంటుంది.

**ఉపసంహారము :-**

**అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః**
**ప్రపంచోపశమ శ్శివోఽద్వైతః।**
**ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ**
**నాత్మానం య ఏవంవేద య ఏవం వేద॥**

అమాత్ర తురీయమైనది, అవ్యవహార్యమైనది, ప్రపంచము యొక్క ఉపశమమైనది, మంగళకరమైనది, ద్వైతరహితమైన ఈ ఓంకారమును తెలుసుకొనినవాడు ఆత్మస్వరూపమును పొందుతాడు.

అకార, ఉకార, మకారము లేనిది అమాత్ర. ఇదియే తురీయ మని అర్థం. తురీయావస్థను చేరిన పిదప వ్యవహారము ఉండదు కాబట్టి అవ్యవహార్యము. ఈ అవస్థయందు సమస్తము ఉపశమించును. సుఖదుఃఖాలు లేకపోవడం చేత శివము. ఇక్కడ ద్వైతభావము స్ఫురించదు. ఈవిధముగా తెలుసుకున్నవాడు అకారమును ఉకారమందు, ఉకారమును మకారమందు, మకారమును అమాత్ర ఓంకారమందు లయము చేసి ఆత్మస్వరూపు డగుచున్నాడు.

ఓంకారములో ఉన్న మాత్రలను ఉపాసించడం వల్ల యే యే లోకాలను పొందుతాము అనే విషయం ప్రశ్నోపనిషత్తులో చెప్పబడింది.

**2) అభ్యాసము:-**

**అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః**
**ప్రపంచోపశమశ్శివోఽద్వైతః।**
**ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ**
**నాత్మానం య ఏవం వేద య ఏవం వేద॥**

అకారాది మాత్రలు లేని ఓంకారమును వ్యవహరించుటకు శక్యముగాదు. అకారాది మాత్రలను క్రమముగా లయము చేయుట వలన ప్రపంచోప శమము. పరిశుద్ధమైనది మరియు ద్వైతభావము లేనిది అయిన ఆత్మను తెలుసుకున్నవాడు అదియే అవుతాడని తాత్పర్యము.

**3) అపూర్వత్వము :-**

**నాన్తః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం। అదృష్టమవ్యవహార్య మగ్రాహ్య మలక్షణమచిన్త్య మవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥**

అంతః ప్రజ్ఞ, బహిః ప్రజ్ఞ, ఉభయప్రజ్ఞకలవాడు కాదు. ప్రజ్ఞానఘనుడు కాదు. కేవల ప్రజ్ఞుడు కాదు. జడుడు కాదు. ఆత్మ ఇంద్రియ అగోచరము. నామరూపాదులు లేకపోవుట చేత అవ్యవహార్యము. అంతఃకరణాదులకు అగ్రాహ్యము. అనుమానాది ప్రమాణములచే తెలుసుకోలేము కాబట్టి అవ్యపదేశ్యము. ఏకాత్మగా నిశ్చయబుద్ధి అనుసరించునది. ప్రపంచోప శమమైనది, శాన్తమైనది, శివమైనది, అద్వైతమైనది అయిన చతుర్థమాత్రనే ఆత్మ. దీనినే తెలుసుకోవాలి.

**ఓంకారమును జపించడం వల్ల మనోచాంచల్యం నశించి, పరమానందము చేకూరును.**

**4) ఫలము :- అమాత్రశ్చతుర్థో- వ్యవహార్యః ప్రపంచోపశమశ్శివోఽద్వైతః। ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం య ఏవం వేద య ఏవం వేద॥**

ఓంకారమంత్రంలో నాలుగవ భాగం, భాగమని చెప్పలేనిది. నిర్వికారమైనది, ప్రాపంచిక చైతన్యానికి అతీతమైనది. మంగళకరమైనది. అద్వైతం. ఈ ఓంకారమే ఆత్మ. ఈ విధంగా తెలుసుకున్నవాడు ఆత్మను ఆత్మచేత పొందుతాడు.

**5) అర్థవాదము :-**

**జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమామాత్రా ఆప్తేరాది మత్త్వాద్వా ఆప్నోతి హవై సర్వాన్ కామాన్ ఆదిశ్చ భవతి య ఏవం వేద ॥**

జాగరితమే స్థానముగా గల వైశ్వానరుడు అకారము, అదియే మొదటిమాత్ర ఎందువలననగా సర్వమును వ్యాపించి ఉండుటవలన లేక మొదటిది అగుటవలన. ఈ విధముగా తెలుసుకున్నవాడు సమస్త కోరికలను పొందుతాడు. అంతేకాకుండా గొప్పవారిలో ప్రథముడిగా ఉంటాడు.

**6) ఉపపత్తి :-**

**నాన్తః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః..... మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః॥**

అంతర్ముఖ స్థితి కాదు, బహిర్ముఖస్థితి కాదు. రెండు చేరిన స్థితికాదు. అది చైతన్యం సమకూరిన స్థితికాదు. చేతన స్థితికాదు. అది కనిపించదు. ఇత్యాది విషయాలు ఆత్మగురించి చెప్పబడ్డాయి.

ఆగమ, వైతథ్య, అద్వైత, అలాతశాంతి ప్రకరణములలోని విషయాలు ఉపపత్తి ద్వారా ఓంకారమందే సమన్వయమని కూడా తాత్పర్యము.

సర్వమంత్రాలకు మకుటాయమానమైన ఓంకారమును ధ్యానించి, భవబంధాల నుండి వైదొలగే శక్తిని శ్రీమలయాళస్వామి మనందరికి అనుగ్రహించు గాక!.

ఓం తత్ సత్ ఓం

జై మలయాళ యతీంద్ర!

జై జై మలయాళ యతీంద్ర!!



సుస్థిర రాజ్య తంత్రములు రాజు లేకపోయినా రాజ్యమును రక్షింపగలవు.